శ్రీ

# రామశతకము.

గ్రంథకర్త:

బుగ్గవిడి వెంకటప్పయ్యా చౌదర




వాణీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1932

ఓం.

# విజ్ఞప్తి.

భక్తాగ్రేసరులారా!

ఈ ప్రపంచమునందు సమస్తజీవులలో మానవజన్మ ముత్తమమని యెల్లరకు దెల్లంబెకదా అందు,

విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక.

అని ప్రహ్లాదుడు వాక్రుచ్చినట్లు భక్తిజ్ఞానవైరాగ్యములలో భక్తియే ప్రధానమైనది. అట్టి భక్తిలేని మానవుని జన్మ మెంతహీనమో వేఱుగా జెప్పనక్కఱ లేదు. ! కావున ప్రతిమానవుడు భక్తిమార్గమునకై పాటుపడుట ముఖ్య కర్తవ్యము. నే నీ రామశతకమును నాభక్తివెల్లడించుటకుగాని నావిద్యావైదుష్యమును చూపుటకుగాని వ్రాసినది కాదు. ఓకు ఎన్నివంక లున్నవిగూడ నెఱుంగని వట్టిమూర్ఖుడను. ఆరామునియందుగల భక్తిపారవశ్యమున మైమఱచి ఏవియో కొన్నిమాటలు పద్యముగా నిమిడ్చి శతక మేర్పరచితిని.

( చెఱుకునకు వంకబోయిన చెడదు తీపి )

అన్నట్లు నాస్వల్పభాషాప్రవేశమువలనగల్గు దోసములను క్షమించి ఈ రామశతకమును ఆదరించుదురని మిక్కిలి ప్రార్థించుచున్నాడను.

ఇట్లు బుధజనవిధేయుడు,

బుగ్గవిడి వెంకటప్పయ్యచౌదరి,

గోకినేపలి.

శ్రీరస్తు.

# శ్రీ రామ శతకము.



పురుషోత్తమ దుస్తర
పాపారణ్యాగ్నికీల పంకజనాభా
ఓ పరమపురుష మాధవ
చేపట్టుము వందనంబు శ్రీరఘురామా ! 1

కం॥ పురహరనుత నీపదములు
శిరమున నిడుకొనియు పూజ శీఘ్రమె చేతున్
కరివరద గోకినేపలి
పురమున నెలకొన్న యజ్ఞపూరుష రామా 2

కం॥ అతిరయముతో గుచేలుడు
నుతియించుచు చెంతరా గనుంగొని భాగ్యో
న్నతు జేసి పంపితివిగద
అతిచిత్రము నీచరిత్ర మచ్యుత రామా 3

కం॥ భానునివంశంబందున్
మానుగనుదయించి దితికుమారుల నెల్లన్
పూని వధియించి భక్తుల
మానక చేకొన్నయట్టి మహాత్ముడ రామా. 4

క॥ సురగరుడోరగ కిన్నర
వరసన్నుత చరణకమల వారిజనయనా
కరుణాకర శ్రుతిచోరక
హరణా శ్రీరాఘవేంద్ర హరరఘురామా. 5

క॥ గోవింద నీదునామము
భావింపగ నజునకైన బశుపతికైనన్
శ్రీవాసవునకు వశమే
వావిరిస్మరియింప నెంతవాడనురామా. 6

క॥ శాంతము సత్యము క్షమ యా
వంతయు గనరాదు వట్టివ్యర్థుడ పుడమిన్
పంతంబు నరుదు లక్ష్మీ
కాంతుడ నీధ్యానముడుగ గనుగొనురామా. 7

క॥ ఎచ్చట జూచిన లేవిక
పచ్చని విలుకాని జనకపాథోధిని నీ
వెచ్చటను బండియుండిన
అచ్చముగను విడువనెపుడు హరిశ్రీరామా 8

క॥ హరినీవె హరుడవీవే
కరమరుదుగ విష్ణువీవె గంజజుడీవే
వరదుడవునీవె లక్ష్మీశ
వరుడవునీవౌను అఘనివారణరామా. 9

క॥ సిరి సమకూర్పగ సీతయు
అరులను బొలయింప నీదు అనుజుడు ఆర్తిన్
హరియింపవాతసూనుడు
దురితాంబుధిబావనీవు దొరవేరామా. 10

క॥ ధీరుడనని భృగురామున
దారికి నడ్డంబునిలచి దశరథపుత్రా
వీరుడ "నావిలు ద్రుంపన"
నా రయమున వానిదర్ప మణచిన రామా. 11

క॥ నారాయణలక్ష్మీధవ
నారాయణచక్రపాణి నరకాంతకశ్రీ
నారాయణ దామోదర
నారాయణయఘువిదూరనగధర రామా. 12

క॥ అంతేతెలియకపోయెను
కాంతుడనావలన తప్పుగలదదియేమో
పంతంబ దేలనాపై
సంతసముగ నీదుభజన సల్పుదురామా. 13

క॥ ఇమ్మహినాపై శత్రు
త్వమ్ముగ వసియించునట్టి పాపాత్ములపో
జిమ్మి ననుగావు మ్రొక్కెద
ఖమ్మము తాలూకనున్న కార్ముకరామా. 14

క॥ కోతుల నందఱగాచిన
దాతవు నీవంచుమిగుల ధైర్యముతోడన్
గోతినయి గోరుచుంటిని
ప్రీతిగ మోక్షంబొసంగు ప్రియమున రామా. 15

క॥ బృందారకులు నుతించగ
నందియు సురజ్యేష్ఠుడొచ్చి సలుపగపూజల్
నందియు నభయమొసంగిన
సుందరుడవు నీవెకావ శూరుడ రామా. 16

క॥ హారువిల్లు విరచి సీతను
గరమరుదుగ బెండ్లియాడి ఘనజనకునిచే
అరణములు గొన్న రాఘవ
పరమదయామతినిజూడు పావనరామా. 17

క॥ చిక్కియు సంసారంబున
నొక్కియు నీదంగలేక నొడబడుచుండన్
జొక్కపు దొరవున్నీవని
మ్రొక్కుచు నేనుంటిగదర ముదమున రామా. 18

క॥ తల్లివి తండ్రివినీవే
యుల్లమునందుండునట్టి యొడయుడవీవే
ఒల్లకయున్నను విడువను
కల్లయుగాదిట్టిమాట కార్ముకరామా. 19

కం॥ పెక్కురు దైవములెల్లను
మెక్కి భజించుటయు నేల మేదినిలోనన్
జక్కని దొరనీవుండగ
నిక్కము నాకేమి కొదువ నిరతుడ రామా. 20

కం॥ పిట్టవలె నాడుచుండియు
పొట్టను గడునింపుకొనియు పోకిరితో నే
దిట్టముగ నిన్నెరుంగక
గట్టిగ నేదిరుగుచుంటి గదరా రామా. 21

కం. గోపాలదైత్యనాశన
పాపడనై యుంటి మధురపాలించెడినా
పాపుడగు నీదు మామను
వాపక ఖండించినట్టి వరదుడ రామా 22

కం. మాయాసంసృతినిండబడి
నానా తాపత్రిదులంగు మమకారమునన్
మామూంధకారమందున
నాయుష్యంబున్నవరకు నగధర రామా 23

కం. దశరథునిగర్భమందున
విశదముజన్మించియుండి వేడుకలలరన్
దశముఖుని సంహరించియు
యశమును చేకొన్నయట్టి యచ్యుత రామా 24

కం. శిష్టముగ నదులస్నానము
గష్టములందియును నెప్పుడుగాంచినగానీ
భ్రష్టత్వముబాసియుగదు
నిష్టతో నిజ్జెర లేదు నిక్కము రామా 25

కం. ఒకసారి నీమొగంబును
పకపకయఁ నవు వెలుంగుపలుకులతోడన్
గకవికలు జెందనీయక
నొకవిధిగనుపించవేల యుర్వినిరామా 26

కం. సుఖులును హితులును భ్రాతృలు
సతతముగనుపింపతనది సర్వమటంచున్
గతియేది తెలియలేకను
మతిహీనులు చెడుదురిలను మహితుడరామా 27

కం. గ్రహభయనివారణంబవు
ఇహమందున శుభములబ్బు ఈప్సితమలరున్
బహుళశోక హరణమగు ని
న్వాహరింపుచుదలచినంత వేడ్కతో రామా 28

కం. కమలాక్ష మాధవాచ్యుత
అమరాధిపవినుత శౌరిఅంబుజనాభా
సుమసాయక జనకా నా
శ్రమబాపగదిక్కునీవె శాశ్వతరామా 29

కం. దానవుని ద్రుంచివైచియు
మానుగ నుగ్రంబుతోడ మాగినురియుండన్
దానవసూనుఁడు జేరగ
పూనియు శాంతంబుఁగొన్న పుణ్యుఁడ రామా. 30

కం॥ మిక్కిలి నీచరణములకు
మ్రొక్కుచునే యుంటిగదర మోహముతో నా
దిక్కీవనినమ్మితి
చక్కని కోదండపాణి సద్గుణ రామా. 31

కం॥ దశకంఠుం డిడు బాధల
విశదము మదినోర్వక విభీషణుఁడు నిన్
దిశయుండు వచ్చి వేడగ
వశమున చేకొన్న యిందువదనుడ రామా. 32

కం॥ మురహర మధుసూదన నా
మొరవినిన చెలువమయ్య మూర్ఖుడనేనున్
ఉరుగుణుడ నీవటంచును
బిరబిర వేడుచుంటి బ్రీతిగ రామా. 33

కం॥ చక్రి రెండక్షరములు
చక్రీన రయించు నఘము శ్రమలును బాయున్
చక్రీశిరెసమకూర్చును
చక్రీయన మోక్షమబ్బు చయ్యన రామా. 34

కం॥ పదియారువేలగోపిక
సుదతులతో గూడినట్లు సొంపుదలిర్పన్
పదకమల పూజసేయుదు
వదలక నాతోడగూడు వాంఛతొ రామా. 35

కం॥ కురుపాండవయుద్ధంబున
గరమొప్పగ నీదుకృపయు గల్గుటచేతన్
సరగున కుంతీతనయుల
దరిజేర్చితి వీవె కావ దశరథరామా. 36

కం॥ శ్రీవింమకోసలంబున
భూమీశుడు దశరథుండు పుత్రప్రియుడై
నీనుమున యాగమొక్కటి
వేసురుసలుపంగ నుద్భవించవె రామా. 37

కం. హనుమంతుడు రామాయని
వినుతించగ నిజములదగె వేగముతోడన్
నినుస్తుతియు సల్పువారికి
ఘనమగు నాపదలుదొలగు గ్రక్కున రామా. 38

కం. కరిరాజుఘోరబాధకు
వెరచియు నిశ్చలపుభక్తివే భజియింపన్
త్వరితంబుగ నాబాధయు
హరియించిన దొరవునీవె అచ్యుతరామా

కం॥ నీలోన జగములన్నియు
లాలితమైయొప్పుచుండు లక్ష్మణయుక్తా
నీలీల లతివిచిత్రము
శీలముగల సూర్యవంశసీతా రామా. 40

కం॥ వేదములు సోమకుండటు
మోదముతో దొంగిలించి పోయిన వెంటన్
ఖేదముతో జలధిమునుగగ
సాధించిన ధీరవర్య సద్గుణ రామా. 41

కం॥ సిద్ధముగ నీదుపదములు
శ్రద్ధయు నేగొల్చుచుంటి తామసమేలా
వద్దనిన విడువనింకను
పెద్దవునీవంచు మిగుల ప్రేమతో రామా. 42

కం॥ సారసలోచన కేశవ
భూరిలసత్సుగుణసాంద్ర భూభుజ మేటీ
ఓరమణ శ్రీవికుంఠా
కారుణ్యంబెపుడుజూపు కామ్యద రామా. 43

కం॥ గరుడతురంగము నెక్కియు
మరుగున నాచెంతజేరి సరసత్వమునన్
కరగెదను జూడవేలా
కరివరదా చిద్విలాస కామ్యద రామా. 44

కం॥ మానసమున నినుదలచిన
మానుగనఘమెల్ల బాసిమర్త్యుఁడు పుడమిన్
ఫూనియు నీ సన్నిధిబల్
మానకచేరంగగల్గు మహితుఁడ రామా. 45

కం॥ సుగ్రీవాగ్రజు ద్రుంచియు
సుగ్రీవుని సాయమునను శూరులఁగొనియున్
సుగ్రీవుని దరిజేర్చి ద
శగ్రీవుని దునిమినట్టి శాశ్వతరామా. 46

కం॥ దానవమదహార శుభకర
మానవసంరక్ష దేహ మంగళరూపా
కాననమున విహరించిన
శ్రీనరహరి నీదుభజన సేయుదు రామా. 47

కం॥ ఇందిరపతి నీచరణము
లందముగా దాసజనులు ఆరసికొలువన్
డెందమున వెతలుమాన్పిన
సుందర గోవిందరమణ [illegible]గుడ రామా 48

కం॥ నినుఁబాడియు మెప్పించెన్
ఘనుఁడగు నారదుఁడగాను గను కృప[illegible]డు
అనవరతము నీనామము
మనమున స్మరియించునట్టి మర్త్యుఁడ రామా 49

కం॥ ఖగవాహన దామోదర
ఖగవాహన పుండరీకకమలదళాక్షా
ఖగవాహన గరుడధ్వజ
ఖగవాహన ఖలవిదారి కార్ముకరామా 50

కం॥ భూసురుఢవగుచు దానము
భాసురముగ నడిగి బలిని బ్రహ్మాదులు సం
తోసమున దనరుచుండగ
వాసిగ నాబలిని నణచివైచినరామా 51

కం॥ కందర్పకోటిసుందర
మందరధర యిందువదన మహనీయగుణా
నందార్భక గోవిందా
పొందును నేగోరుకొంటి పుణ్యుడరామా 52

కం॥ వందనము శ్యామసుందర
వందనమిదె దేవదేవ వారిజనయనా
వందనము మారజనకా
వందనములు శ్రీమురారివరదుడరామా 53

కం॥ ఉదయమున లేచి యంతట
ముదమున సంసారమంటి మూర్ఖత్వమునన్
మదయుక్తుడనై సతతము
భోగలను కాలంబువ్యర్థబుచ్చితి రామా 54

కం॥ మగధుండు వెంటనంటియు
నగధర నిన్దరుమవచ్చి నగ్గనుపడకే
ఖగవాహన ద్వారకపురి
నగవక నిర్మించినట్టి వరదుడరామా. 55

కం॥ దాసులను బ్రోతువందురు
దోసములున్న ప్పటికిని దొలగించియు నా
యాసముతో నుంటి నేలుము
కోసలపురి రాజపుత్ర కోమల రామా. 56

కం॥ నరనాయక లక్ష్మీపతి
నరనాయక భానువంశ నర కాంతక శ్రీ
నరనాయక పురుషోత్తమ
నరనాయక యోన్నృపాల నగధర రామా. 57

కం. శ్రీవర నీనుతి నెప్పుడు
భావమునన్ మరువకున్న భవమునుబాయుఁ
గోవిదులు జెప్పవింటిని
పావనచారిత్ర పతితపావన రామా 58

కం. వరమాత్మ కేశవాచ్యుత
గిరిజాపతి నుతవినోద కీర్తివిశాలా
సరసిజనయన సురావన
వరదామోదితికుమారవారణ రామా 5

కం. స్తంభమున వెడలిదానవ
డింభకుచేపట్టి సురలుడీకొని మ్రొక్కన్
కుంభించి హేమాకశిపుని
గంభీరంబణచినట్టి ఘనుడవురామా. 60

కం. జానకిగోరినగోర్కెను
మానకనే దెత్తునంచు మాయాలేడిన్
కాననమున చేపట్టగ
శ్రీనాయక యేగితీవు శీఘ్రమెరామా. 51

కం. ఎంతోకాలము బ్రతికిన
సుంతయు మరణంబుబోదు చోద్యములలరన్
పంతముతో నిన్నువేడిన
కొంతయుభవముండబోదు కోరినరామా. 62

కం. ఘనక్రూరుడాయజామిళు
డనువుగ నవసానకాలమందు నుతించన్
చనువున మోక్షముసంగిన
వనజాక్షుడ శ్రీ ఉపేంద్రవరదుడరామా. 63

కం. జనకుని యాజ్ఞనుగైకొని
ఘనముగ సంతోషములర గ్రక్కున నీవున్
వనముకు నే[illegible]విశద
మనమున శంకింపకుండ మహితుడరామా. 46

కం. డెబ్బది రెండును వెల్వల
గొబ్బున సముకూర్చుకొనియు కొన్నాళ్ళకు బల్
నిబ్బరముతోడ సీతను
అబ్బురమున గన్నయట్టి అచ్యుత రామా. 65

కం. రయమున మునితో నేగియు
భయమును చేకొనక యుండి బాల్యమునందే
జయశాలివై దనుజ సం
చయముల రూపణ చినట్టి జానకి రామా. 66

కం॥ క్రూరాత్ముల శిక్షించుట
భారముగల దేవదేవ పద్మదళాక్షా
ఓ రమణ సరసిజాక్షా
వీరుడవని వేడుచుంటి విమలక రామా. 67

కం॥ నారదముని వర్యాదుల
కారుణ్యముతోడ మున్ను గాచితివని ని
న్నారసి నమ్మితి నేలుము
శ్రీరవికుల సుందరాంగ సీతా రామా. 68

కం॥ ఎల్లప్రపంచంబేలెడి
సల్లలితుడవంచు మిగుల సర్వజ్ఞులు బల్
మెల్లగ జెప్పగ విని నే
కొల్లగ ధ్యానంబు జేతు కోమల రామా. 69

కం॥ దిక్కెవ్వరు భక్తులకును
దిక్కెవ్వరు వివిధమైన దీనుల కెవ్వర్
దిక్కెవ్వరు పాండవులకు
దిక్కెవ్వరు నీవునాకు దిక్కవురామా. 70

కం॥ ఈశుడ జగదీశుడ పర
మేశుడ వైకుంఠవాస మేచకగాత్రా
ఆశలుదీర్చెడి దాతవు
కేశవగోవింద శౌరి కేవలరామా. 71

కం॥ వృక్షముచాటుననుండియు
గక్షతో కపినాధువాలి ఖండించిన శ్రీ
అక్షయపతి దామోదర
పక్షము గానంగదేర పావనరామా. 72

కం॥ భరతుడు రాజ్యముసేయగ
నిరతము నది భారమంచు నినుస్మరియింపర్
సరగునను నీదు పాదుక
శిరవుగ నీవొసగ రాజ్యమేలెనురామా. 73

కం. పంకజలోచన మురహరి
శంకరనుత శ్యామలాంగ శౌరిముకుందా
పంకముతో నున్న నీపద
పంకజములు గొల్తు పతితపావనరామా. 74

కం॥ నీమాయదాటతరమా
నేమానవుడైనగాని యిమ్మహిలోనన్
సామాన్యుదలచినంతట
ప్రేమతోరక్షించి తండ్రుప్రీతిగ రామా. 75

కం॥ శ్రీపతిహరి దామోదర
గోపతినుత గర్వభంగకోమలగాత్రా
కాపాడితీవు వీరుల
నాపాపము యేమొకాని నగధర రామా. 76

కం॥ నిను గొనియాడగవశమా
ఇనవంశజ రాజవరద ఈశ్వరుకైనన్
ఘనమగు నీనుహిమను నే
మనమున స్మరియింపనెంత మనుజుడ రామా. 77

కం॥ ధీరుల నందరిగాచిన
శూరుడవనివాంఛతోడ శోకముబాపన్
పారాయణజేసెద నా
వీరుడ నాపాలికల్పవృక్షమరామా. 78

కం॥ ఇలధవభవహరమదహర
కలహార శ్రీకంజనయన కామితఫలదా
వెలయగ నీచరణంబులు
ఇలపై నేనెపుడు జూతు నీసడరామా. 79

కం॥ నిన్నుతియించెడువారికి
వున్నట్టియుకష్టములను వూహించియుబల్
పెన్నిధివియై హరింతువు
పన్నగమున బవ్వళించు పావన రామా. 80

కం॥ నారాయణ నీనామము
పారాయణజేయ నీదుపాదాబ్జంబుల్
వీరుడయి మ్రొక్కగల్గను
ఘోరాసుర హరణలోక గురువర రామా. 81

కం॥ శ్రీకేశవ మధుసూదన
రాకాధిపముఖవిశాల రాక్షసహరణా
లోకేశ ఈశవందిత
కాకాసురగర్వభంగ కార్ముక రామా. 82

కం॥ శ్రీమహనీయగుణాకర
తామరసగర్భజనక తాటకహరణా
దామోదర నారాయణ
కౌమారీ వినుతశీల కార్ముక రామా. 83

కం. జ్ఞానుడనని మనమందున
మానుగ తనకుండునట్టి మదగర్వమునన్
హీనులయి మోక్షమార్గము
గానక చెడుచుంద్రు మూఢజనములు రామా॥

కం॥ సీతయు ననుజుడుసహితము
ఖ్యాతిగనీజనకునాజ్ఞ గైకొనినడవిఁ
సీతో విహారించిరిగద
భూతలమున వాసుదేవ పుణ్యుడరామా. 85

కం॥ వ్రతములు జపములుదానము
సతతముతీర్థంబులేగు శ్రమబహుళకన్నఁ
క్షితియందు నీదుభజనయు
మతిగల్గియు జేయముక్తిమార్గమురామా. 86

కం॥ కొండనునెత్తియు నంతట
దండిగ గోగణముగాచి దగగోపకులఁ
మెండగు కృపతో జూచిన
పండితనుత బుణ్యపురుష పావనరామా. 87

కం॥ తిరుపతిలోనుండువేల్పుని
స్థిరముగ నుతియించినంత తీవ్రముతోడఁ
వరములొసంగక నుండునె
వెరువకనేనెటులబొక వేడితిరామా. 88

కం॥ ఎప్పుడు నాహృదయంబున
తప్పకధ్యానంబొనర్తు తథ్యములలరఁ
మెప్పేలేదింకను నా
అప్పా ఇక్ష్వాకువంశ హరిరఘురామా. 89

కం॥ వారధిగట్టియు లంకకు
జేరియు వైదేహిఁగాంచి క్షేమముఁగొనియున్
వీరులగు రాక్షసేంద్రుల
వారించిన చంద్రవదనవరదుడరామా. 90

కం. సభలోపల పాండవసతి
ప్రభుడవు నీవేయటంచు ప్రార్థనసేయన్
విభవమున వలువలొసగిన
ఇభవరదుడవీవే కావ ఈశుడ రామా. 91

కం. భూతలమున గౌతమసతి
రాతిగబడియుండ గొప్ప రాజిలుపాద
బ్జాతము సోకినవెంటనె
నీతిరుమంత్రము బలించెనీతితో రామా. 92

కం. ఉత్తరకు జననమందిన
ఉత్తమపురుషుండు నీదుఉరుతరకృపచే
మత్తుడయి రాజ్యమేలెను
అత్తరికృపజూపవేల అచ్యుతరామా. 93

కం. వసుదేవుడు గతభవమున
పసగతిబలువిధములలరప్రార్థింపగసం
తసమున పుత్రుడవైతివి
అసురుల ఇలద్రుంచుటకును హరిరఘురామా. 94

కం. ఇలవనుజుడు నినుగోరగ
జలనిధిమధ్యమున బుణ్యజనములుబోగడఁ
గులపర్వతంబు నిల్పిన
జలజాక్షుఁడవీవె యంద్రు జగదభిరామా 95

కం. రాధారుక్మిణిలోలా
మాధవిపూజావినోద మన్మథజనకా
కోదండపాణిధీవర
వాదేలను వ్యర్థుపైని వరదుడ రామా. 96

కం. రామానీపైనొకకృతి
కామించియు కందశతము కడుపొరపాట్లన్
నీమమున జెప్పియుంటిని
వేమరు దయస్వీకరింపవే రఘురామా. 97

కం. రామా రవికులసోమా
రామాసద్గుణవిసాంద్ర రాక్షసమారా
రామాదుర్జనభంజన
రామాసీతాకళత్ర రఘుకుల రామా 98

కం॥ ఈపద్యంబులు జదివిన
బాపంబులుదొలగు శుభము బాయకనుండున్
బ్రాపుగ సిరికూడియు నీ
దాపున జేరంగగల్గు ధన్యుడురామా. 99

క॥ సంతేరాసాయందున
వింతగ చాలీసుఫసలి విరివిగబహామ్యా
వుంతీసుతేదియందున
వంతుగ నీపద్యశతము వ్రాసితిరామా. 100

క॥ వరబుగ్గవీడి వంశ్యుఁడ
నరసింహాఖ్యుని ద్వితీయనందనుఁడన్నే
ధర వెంకటప్పయాఖ్యను
బరగెడు వాఁడనుత్వదీయభక్తుఁడరామా. 101

సంపూర్ణము.

వలయువారు:—బుగ్గవడి వెంకట పున్నయ్యచౌదరి,

గోకినేపల్లి, నేలకొండపల్లి పోష్టు,

ఖమ్మంతాలూకా, నైజాం

అని వ్రాసిన ఉచితముగ బడయగలరు.